# కారుణ్య ప్రభువు అల్లాహ్

సయ్యిద్ అబ్దుస్సలాం ఉమరీ

## ముఖ్య గమనిక:



29/ 05 / 2021




Prabodhanam printing press

# కారుణ్య ప్రభువు అల్లాహ్

నీతిని బోధించడానికి అర్హత లేనివాళ్లు నీతి సూక్తులు చెప్పడం ప్రారంభిస్తే, ప్రజలకు ఆ వ్యక్తుల మీదే కాక అసలు నీతి మీదే నిరసన భావం ఏర్పడే ప్రమాదం ఉంది. కాబట్టి అల్లాహ్ ఇలా హెచ్చరిస్తున్నాడు:

మీరు మంచిపనులు చేయమని ఇతరులకైతే హితబోధ చేస్తారు. కాని మిమ్మల్ని మీరు మరచిపోతున్నారే! మీరు గ్రంథ పఠనం కూడా చేస్తున్నారు కదా! (ఇలా ఎందుకు ప్రవర్తిస్తున్నారు?). మీరు బుద్ధి నుపయోగించరా? (బఖరః -44)

మీరు చేయనిదాన్ని గురించి మాట్లాడుతారెందుకు? చేయనిదాన్ని గురించి చెప్పుకోవడం దేవునికి చాలా అప్రియమైన విషయం. (అస్సఫ్: 3)



అనంత కరుణామయుడు అపార దయానిధి అయిన అల్లాహ్ పేరుతో

# ముందు మాట

ఆకాశం నుంచి కురిసే వాన చినుకయినా, మట్టిలో నుండి పుట్టుకువచ్చే ధాన్య ఫలాదులయినా, నీటిలో లభ్యమయ్యే నిక్షిప్త సంపదలయినా, గాలయినా, నీరయినా, నిప్పయినా – అంతా అల్లాహ్ కరుణకు దర్పణమే. కారుణ్య ప్రభువు అల్లాహ్ మానవుడిని సతతం కని పెట్టుకునే ఉన్నాడు. మనిషి చెప్పేది, చేసేది, తలపోసేది అన్నీ ఆయనకు తెలిసినవే. ఆయన వినలేనిది లేదు, కన లేనిది లేదు, ఆయన గ్రాహ్య పరిధిలో రానిదేది లేదు. ప్రపంచంలో అత్యంత నిగూఢమయిన మనస్సునూ అందులోని భావాలను తెలుసుకుండాయన. పూవులో తావి ఇచ్చే సందేశాన్నీ వింటాడు. వెలుగు చొరబడని చీకటి పాతాళాల్లోని నల్లని గాలినీ ఆయన చూస్తాడు. ఒక్క మాటలో చెప్పాలంటే మనిషికి అవసరమయిన వాటన్నింటినీ సర్వకాల సర్వావస్థలయందు నిరంతరాయంగా, నిరుపమాన రీతిలో సమకూర్చే ఆయన భౌతిక నేత్రాలకు కనబడని కారుణ్య ప్రభువు. మనందరి ఆ కారుణ్య ప్రభువుని తెలుకొని, ఆయన విధేయతలో జీవిన్చాలన్నదే మా ఆకాంక్ష!

సయ్యిద్ అబ్దుస్సలాం ఉమరీ



# విషయ సూచిక





## అల్లాహ్ కరుణ అపారం:

అల్లాహ్, కరుణ-దయ, జాలి, ప్రేమ, దీర్ఘ శాంతం, విస్తార కృపా గుణం గలవాడు. ఆయన సమస్త ప్రాణుల యెడల కరుణ చూపేవాడు. దోషాన్ని, పాపాన్ని, అపరాధాన్ని క్షమించేవాడు. ఆయన ఒక దాన్ని ధర్మసమ్మతం చేశా డంటే కారణం కరుణ. ఒక విషయాన్ని నిషేధించా డంటే కారణం కరుణ. ఆయన ఒకరికి అపార సంపదల్ని ఇవ్వడం ఎలా కరుణ కాగలదో, ఒకరికి ఇవ్వక పోవడం కూడా కరుణే. తన ఇచ్ఛానుసారం తనపై కరుణ తప్పనిసరి చేసుకున్న ఆయన, కొన్నింటిని కనకూడదు, కొన్నింటిని వినకూడదు, కొన్నింటిని అనకూడదు, కొన్నింటిని తినకూడదు, కొన్నింటిని చెయ్యకూడదు అని ఆంక్షలు విధించడం కూడా ఆయన అపార కరుణకు నిదర్శనమే. మనం ఏ అవస్థలోనూ, ఏ కాలంలోనూ ఆయన కరుణ లేకుండా స్వేచ్ఛగా తిరగ లేము, శ్వాస పీల్చలేము. ఆయన కరుణకు నోచుకోని ప్రాణి అంటూ ఏది లేదు.



## అల్లాహ్ కరుణ అనంతం

ఆది మానవుడు ఆదమ్ (అ) వల్ల ఒక పొరపాటు జరిగి పశ్చాత్తాపం చెందినప్పుడు ఆయన కరుణను చూసారు. ప్రవక్త ఇబ్రాహీమ్ (అ)ను భగభగ మండే అగ్ని గుండంలో విసరేయ బడినప్పుడు ఆయన కరుణను చూసారు. ప్రవక్త నూహ్ (అ) - జల ప్రళయం చోటు చేసు కున్నప్పుడు ఆయన కరుణను చూశారు. ప్రవక్త యూసుఫ్ (అ)ను బాల్యంలో ఓ బావిలో విసరేయబడినప్పుడు ఆయన కరుణను చూశారు. నిండు యవ్వనంలో చెరసాలలో బంధీగా ఉన్నప్పుడు ఆయన కరుణను చూసారు. ప్రవక్త యూనుస్ (అ) నడి సముద్రంలో, చేప కడులో, మూడు చీకట్ల మధ్య ఆయన కరుణను చూశారు. ప్రవక్త మూసా (అ)ను పసి ప్రాయంలో నైలు నదిలో ఆయన తల్లి, అల్లాహ్ ఆనతి మేరకు వదిలేసినప్పుడు ఆయన కరుణను చూశారు. ప్రాణ శత్రువయిన ఫిర్ఔన్ దర్బారులో దర్జాగా పెరుగుతూ ఆయన కరుణను చూశారు. సముద్రం 12 ద్వారాలుగా చీలినప్పుడు ఆయన కరుణను చూశారు. బండరాయి నుండి 12 సెలయేర్లు ప్రవహించినప్పుడు ఆయన కరుణను చూశారు. మేఘమే నీడయి నడిచినప్పుడు ఆయన కరుణను చూశారు. మన్న్-సల్వా అవతరించినప్పుడు ఆయన కరుణను చూశారు. మసర్‌ను జయించినప్పుడు ఆయన కరుణను చూశారు.

ప్రవక్త ఈసా (అ)ను శిలువనెక్కించడానికి సన్నాహాలన్నీ పూర్తయి శిలువ సిద్ధంగా ఉన్నప్పుడు ఆయన కరుణను చూశారు. గుహ ప్రజలు-యువకులు గుహలో తలదాచుకుని 300 సంవత్సరాలు నిద్రావస్థలోనే గడిపి మళ్ళి లేచినప్పుడు ఆయన కరుణను చూశారు. ప్రవక్త ముహమ్మద్ (స) సౌర్ గుహలో ఉన్నప్పుడు ఆయన కరుణను చూశారు. ప్రపంచంలోని ప్రతి ఒక్క ప్రాణి తన జీవితంలో ఏదోక మలుపులో ఆయన కరుణను దర్శించుకోవడం జరుగుతూనే ఉంటుంది. ఇది నిజ దేవుని నిరంతర ప్రక్రియ, నిలువరించాలని, నియంత్రించాలని, నిర్మూలించాలని  ఎవరు ఎన్ని విధాలుగా ప్రయత్నించినా నిలవని ప్రక్రియ. అట్టి కరుణామయుడు మనిషిలో గల సంకుచితత్వాన్ని సయితం పరిచయం చేస్తున్నాడు:

**"వారికి చెప్పు: ఒకవేళ నా ప్రభువు కారుణ్య నిధులే గనక మీ అధీనంలోకి వస్తే, అప్పుడు మీరు అవి ఎక్కడ ఖర్చయిపోతాయోమోనన్న భయంతో వాటిని ఆపి ఉంచేవారు. (వాస్తవం ఏమిటంటే) మానవుడు సంకుచిత మనస్కుడు". (అల్ ఇస్రా: 100)**



## అల్లాహ్ దయా భిక్షం – మన జీవితం:

నా పొలం, నా హలం, నా ధనం, నా బలం, నా దళం, నా కలం, నా గళం, నా దేశం, నా ప్రాంతం, నా రాష్ట్రం, నా రాజ్యం అని మనిషి జీరాలు పోయే సమస్తం అల్లాహ్ కరుణా ప్రసాదం. మన దేహం, మన ఆరోగ్యం, మన ఆహారం, మన ఆహార్యం, మన గృహం, మన పరివారం, మన జీవితం, మన శ్రేయం, మన క్షేమం సర్వం అల్లాహ్ కరుణా భిక్షం. నాది అన్న స్థలం, నాది అన్న శరీరం, నాది అన్న సంతానం,నాది అన్న ఉద్యోగం, నాది అన్న సామ్రాజ్యం -అన్నీ మనల్ని వీడి పోతాయి. ఏది ఏ విధంగానూ మనకు పనికి రాని ప్రళయ దినాన కూడా అల్లాహ్ కారుణ్యం వెన్నుదన్నుగా నిలుస్తుంది. అంతెందుకు, మన దాహం తీర్చే జలం ఆహార నాళం నుండికాక గాలి ద్వారం గుండా వెళితే ఆదే ప్రాణం తీసే హాలహలంగా పరిణమిస్తుంది. అలా జరగడం లేదంటే అది కేవలం అల్లాహ్ కరుణ చలువే అని అర్థం.

వాస్తవంగా మనం చేసే నిర్వాకాలకుగాను అల్లాహ్ పట్టుకోవడం ప్రారంభిస్తే భూమి మీద మనిషనే వాడు ఉండడు. అయినా ఆయన మనల్ని కరుణించి క్షమిస్తున్నాడు. ఇమామ్ హసన్ బస్రీ (ర) ఇలా అభిప్రాయ పడ్డారు:

"కొందరున్నారు, వారు అల్లాహ్ యెడల లేనిపోని ఆశలు పెట్టుకున్నారు. ఒక్క సత్కార్యం కూడా చెయ్యని దుర్భిక్ష స్థితిలో లోకాన్ని వీడి వెళ్ళారు. మాట వరసకయితే "మేము అల్లాహ్ యెడల సద్భావం కలిగి ఉన్నాము" అనేవారుగానీ, అల్లాహ్ సాక్షిగా వారు అబద్ధమాడు తున్నారు. ఒకవేళ అల్లాహ్ యెడల వారికి సద్భావనే గనక ఉన్నట్లయితే వారి చేసే పనులు కూడా మంచివై ఉండేవి".



## అల్లాహ్ కరుణ అపూర్వం

సాధారణంగా సమాజంలో కరుణ పాళ్లు తక్కువగా కనిపించడం కారణంగా మనుషులమయిన మన మధ్యే కరుణ కరువయితే అల్లాహ్ ఎక్కడ కరుణిస్తాడు అన్న దుష్భావన చోటు చేసుకుంది కొందరిలో. వాస్తవంగా ఆయన స్వయం కరుణామయుడు. **'అర్రహ్మాన్'** ఆయన అస్తిత్వానికి చెందిన నామం, **'అర్రహీమ్'** ఆయన గుణానికి చెందిన నామం. ఆయన అధిక కరుణ కలవాడు, కాదు కాదు విశ్వంలో ఉన్న ప్రాణులన్నింటి కరుణ ఆయన కరుణా భాగాల్లోని వందో భాగం మాత్రమే. ఆయన కరుణామయుల్లోకెల్లా గొప్ప కరుణామయుడు. మహనీయ ముహమ్మద్ (స) ఇలా అన్నారు:

**"నిశ్చయంగా అల్లాహ్ కరుణా భాగాలు వంద. వాటిలో నుండి ఒక భాగాన్ని మాత్రమే మానవులు, జిన్నులు, చతుష్పాదులు, చరాచరాలన్నింటి మధ్య అవతరింపజేశాడు. ఆయన ఆ కరుణా భాగం ప్రభావంతోనే అవి పరస్పరం మృదు వైఖరిని కలిగి ఉన్నాయి. పరస్పరం కరుణా వాత్సల్యాలను కురిపించుకుంటున్నాయి. ఆ కరుణ ప్రభావంతోనే ఒక క్రూర జంతువు కూడా తన సంతానం యెడల కరుణతో మసలుకుంటున్నది. రేపు ప్రళయ దినాన తన దాసుల్ని కరుణించడానికిగానూ తన కరుణకు సంబంధించిన 99 భాగాలను ఎత్తి పెట్టాడు"**. (ముత్తఫఖున్ అలైహి)



## నిరాశకు తావు ఇవ్వనిది అల్లాహ్ కరుణ

తన కోపాన్ని జయించిన కరుణతో అల్లాహ్ ఇలా పిలుపునిస్తునాడు:

"తమ ఆత్మలపై అన్యాయానికి ఒడిగట్టిన ఓ నా దాసులారా! నా కారుణ్యం యెడల నిరాశ చెందకండి. నిశ్చయంగా అల్లాహ్ సకల పాపాలను మన్నించ గలవాడు". (జుమర్:53)

హజ్రత్ అబూ హురైరా (ర) కథనం – ప్రవక్త (స) ఇలా ప్రవచించారు: "పూర్వం బనీ ఇస్రాయీల్‌లో ఇద్దరు మిత్రులు ఉండేవారు. ఒకడు ధర్మ కార్యాల్లో బాగా పరిశ్రమించేవాడు. ఒకడు కాసింత సోంబేరి, ఒక విధంగా చెప్పాలంటే పాపి. "నీ ఈ నిర్వాకాలను తగ్గించుకో, నువ్వు నీ స్థితిని మార్చుకో" అని ధర్మపరాయణుడయిన మిత్రుడు హితవు పలికేవాడు. అందుకు సమాధానంగా 'నా విషయాన్ని నా ప్రభువుకు అప్పగించి, నీ పని నువ్వు చూసుకో' అనేవాడు మరో మిత్రుడు. అలా ఒక రోజు అతను మహా నేరంగా భావించే ఓ కార్యానికి పాల్పడుతూ చూసిన ధర్మపరాయణుడు ఉక్రోషానికి లోనయి – "ఇకనయినా నీ ప్రవర్తనను మానుకో – ఇంత జరిగాక కూడా నువ్వు మారవా?" అని కాస్త గట్టిగానే మందలించాడు. అందుకు సమాధానంగా 'నా విషయాన్ని నా ప్రభువుకు అప్పగించు. అయినా నువ్వేమయినా నా మీద కాపలాదారునిగా చేసి పంపించ బడ్డావా?' అన్నాడు మరో మిత్రుడు. అది విని అహం దెబ్బ తిన్న ఆ సోదరుడు అగ్గి మీద గుగ్గిలమవుతూ – 'అల్లాహ్ సాక్షిగా! చెబుతున్నా, అల్లాహ్ నిన్నెన్నటికీ క్షమించడు గాక క్షమించడు', లేదా నిన్ను స్వర్గంలో ప్రవేశింప జేయడు' అనేశాడు.

వారివురూ మరణించారు. అల్లాహ్ సమక్షంలో సమీకరించ బడ్డారు. ధర్మ పరాయణున్ని ఉద్దేశించి – "నీకేమయినా నాకు సంబంధించిన సర్వ జ్ఞానం ఉండేదా? నా చేతిలో ఉన్న దానికి నువ్వేమయినా అధికారిగా ఉన్నావా?" అని ఆగ్రహించగా, పాపిని ఉద్దేశించి – "వెళ్ళు నువ్వ నా ప్రత్యేక కరుణతో స్వర్గంలో ప్రవేశించు" అంటాడు అల్లాహ్. ఆ తర్వాత మొదటి వ్యక్తిని ఉద్దేశించి–"ఇతన్ని లాక్కెళ్ళి నరకంలో పడేయండి" అని ఆజ్ఞాపిస్తాడు. (ముస్నద్ అహ్మద్)



ఈ హదీసుని ఉల్లేఖించిన తర్వాత అబూ హురైరా (ర) ఇలా అన్నారు: **"ఏ శక్తి స్వరూపుని చేతిలో నా ప్రాణముందో ఆయన సాక్షిగా! మనిషి మాట్లాడే చిన్న మాట అతని ఇహాన్ని, పరాన్ని నాశనం చేసేస్తుంది".**

**'కోపం కొంపని కొల్లేరు చేస్తుంది'** అనడానికి దీనికి మించిన ఉపమానం మరొకటి లేదు. అలాగే **'దేవుడు కూడా వీడిని మార్చ లేడు'** **'అల్లాహ్ భీ తుఝే మాఫ్ నహీ కర్తా'** లాంటి అనుచితమయిన, అనాలోచితమయిన, ఆవేశ పూరితమయిన మాటలు అనడం మానేయాలి. కరుణామయుడయిన అల్లాహ్ కర్తవ్య బోధ చేస్తున్నాడు:

**"(ఓ ప్రవక్తా!) నిశ్చయంగా నేను అమితంగా క్షమించేవాడిననీ, అపారంగా కరుణించేవాడిననీ నా దాసులకు తెలియజెయ్యి". (అల్ హిజ్ర్: 49)**

**"నేను ఫలానా వ్యక్తిని క్షమించను" అనేటంతటి దుస్సాహసం చేసిన వాడెవడు? నేను ఫలానా వ్యక్తిని క్షమిస్తున్నాను. నీ కర్మల్ని వృథా పరుస్తున్నాను"** అని అల్లాహ్ అంటాడు అన్న ప్రవక్త (స) వారి మాట ఈ సంధర్భంగా గుర్తుంచుకోదగినది.



## మిన్నంటే పాపాల్ని సయితం మన్నించే ప్రభువు అల్లాహ్

"ఎముకలు ఉడిగి, కనుబొమ్మలు సయితం రాలి పోయిన ఓ వృద్ధుడు ప్రవక్త (స) వారి ......సన్నిధికి వచ్చి ఇలా విన్నవించుకున్నాడు-"ఓ దైవప్రవక్తా! ఓ వ్యక్తి ధిక్కార ధోరణితో పాపాల మీద పాపాలు చేశాడు. ఏ కోరిక కలిగినా, ఏ అవసరం ఏర్పడినా ధర్మాధర్మాలను మాని బరి తెగించేవాడు. అతను పాల్పడని పాప మంటూ లేదు. ఒకవేళ అతడొక్కడి పాపాలను భూ వాసుల మధ్య పంచి వేసినట్లయితే అవి వారిని సయితం నాశనం చేసేస్తాయి. అలాంటి వ్యక్తికి క్షమాభిక్ష లభిస్తుందా?".

(ఆ వ్యక్తి ఇతనే అని తెలుసుకున్న) ప్రవక్త (స) – "నువ్వు ఇస్లాం స్వీకరించావా?" అని అడగ్గా, 'అవును' అన్నాడా వ్యక్తి. అందుకు ప్రవక్త (స)-"వెళ్ళు సత్కార్యానికి శ్రీకారం చుట్టు, దుష్కార్యాలను వదిలి పెట్టు. అల్లాహ్ (తన కరుణతో) నీ పాపాలను పుణ్యాలుగా మార్చి వేస్తాడు" అన్నారు. 'నా ధిక్కార ధోరణులు, నా పాపాల పరిస్థితి ఏంటి?' అన్నాడా వ్యక్తి మళ్ళీ. "నీ ధిక్కార ధోరణులు, నీ పాపాలను సయితం మన్నిస్తాడు" అన్నారు ప్రవక్త (స). అది విన్న ఆ వృద్ధుడు – కనుమరుగయ్యేంత వరకూ అల్లాహు అక్బర్ అంటూనే ఉన్నాడు.

(ఇమామ్ అల్బానీ( రహ్మ) దీన్ని సహీహ్ అని ధృవీకరించారు)

"అయితే (పాప కార్యాల తర్వాత) ఎవరు పశ్చాత్తాపం చెంది, విశ్వసిస్తారో, సదాచరణ చేస్తారో అలాంటి వారి పాపాలను అల్లాహ్ పుణ్యాలుగా మార్చి వేస్తాడు. అల్లాహ్ క్షమాభిక్ష పెట్టేవాడు, కరుణాకరుడు". (అల్ ఫుర్ఖాన్: 70)



# అల్లాహ్ కరుణ పొందే మార్గాలు

**1) పూర్ణ విధేయతతో, సత్సంకల్పంతో ఆయన్ను ఆరాధించాలి.**

ఆరాధనా ఆదేశాల్ని పాటించినట్లే, ఆదాబులను తెలుసుకోవాలి. అది మనపై విధించే బాధ్యతలను సజావుగా ఉత్తమ పద్ధతిలో నిర్వర్తించాలి. మన ప్రార్థనలు ఇహ్సాన్ స్థాయికి చేరేలా ప్రయత్నించాలి.

**"నిశ్చయంగా అల్లాహ్ కారుణ్యం సజ్జనులకు చాలా దగ్గరగా ఉంది". (ఆరాఫ్: 56)**

**2) దైవభీతి కలిగి జీవించాలి.**

ఆయన చెయ్యమన్నవి చెయ్యాలి, చెయ్యకూడదు అన్న వాటికి దూరంగా ఉండాలి. ప్రవక్త (స) వారి సంప్రదాయాన్ని అనుసరించాలి. జకాత్ సొమ్మును చెల్లించాలి.

**"మరియు నా కారుణ్యం అన్ని వస్తువులనూ ఆవరించి ఉంది. భయభక్తుల వైఖరిని అవలంబిస్తూ, జకాతును చెల్లిస్తూ, మా ఆయతులను విశ్వసించేవారి పేర దాన్ని తప్పకుండా వ్రాస్తాను". (ఆరాఫ్: 156)**

**3) సృష్టిరాసుల యెడల కరుణతో మెలగాలి.**

**"కరుణించే వారిని అల్లాహ్ కరుణిస్తాడు. మీరు నేలనున్న వారిపై కరుణ జూపండి. నింగినున్న వాడు మిమ్మల్ని కనికరిస్తాడు"** అన్నారు ప్రవక్త (స). (తిర్మిజీ)

**4) విశ్వసించిన మీదట అవసరం అనిపిస్తే స్వస్థలాన్ని, స్వీయ అవలక్షణాలను పరిత్యజించేందుకు సిద్ధమవ్వాలి.**

ఇంకా అవసరం అనిపిస్తే నోటితో, రాతతో,చేత్తో చెడును సంహరించే ప్రయత్నం-జిహాద్ చెయ్యాలి. **"నిశ్చయంగా విశ్వసించినవారు, హిజ్రత్ చేసినవారు, అల్లాహ్ మార్గంలో జిహాద్ చేసేవారు అల్లాహ్ కారుణ్యానికి నిజమయిన అభ్యర్థులు. మరియు అల్లాహ్ అమితంగా క్షమించే వాడు, అపారంగా కరుణించేవాడు".**(అల్ బఖరహ్: 218)



5) అల్లాహ్ ఆదేశించిన హద్దుల్లో, ప్రవక్త (స) తెలియజేసిన పద్ధుల్లో నమాజును స్థాపించాలి.

"మరియు నమాజును స్థాపించండి, జకాతును చెల్లించండి. దైవప్రవక్తకు విధేయులుగా మసలుకోండి తద్వారానే మీరు కరుణించ బడతారు". (అన్నూర్; 56)

6) అల్లాహ్ నామాలయిన 'అర్రహ్మాన్' 'అర్రహీమ్'తో ఆయన్ను వేడుకోవడం.

ఈ వేడుకోలు అల్లాహ్ నేర్పిన, ప్రవక్త (స) వారి సూచించిన విధంగా ఉండటం శ్రేయస్కరం. వారు ఇలా ప్రార్థించారు:

"మా ప్రభూ! నీ వద్ద నుంచి మాకు కారుణ్యాన్ని ప్రసాదించు". (అల్ కహఫ్: 10)

"ఓ ప్రవక్తా! ఇలా ప్రార్థించు! నా ప్రభూ! క్షమించు, కరుణించు. కరుణించే వారందరిలోకెల్లా నువ్వు ఉత్తమోత్తమ కరుణాకరుడవు". (అల్ మోమినూన్: 118)

7) ఖుర్ఆన్ ఆదేశాలను పాటించాలి.

"మరియు ఇది మేము అవతరింపజేసిన శుభప్రమయిన గ్రంథం. కాబట్టి మీరు దీనిని అనుసరించండి. దైవభీతి కలిగి జీవించండి. తద్వారా మాత్రమే మీరు కరుణించబడే అవకాశం ఉంది". (అల్ అన్ఆమ్: 155)

8) ఖుర్ఆన్ పారాయణం, శ్రవణానందంగా, శ్రద్ధగా వినాలి.

"ఖుర్ఆన్ పారాయణం జరుగుతున్నప్పుడు దానిని శ్రద్ధగా వినండి. నిశ్శబ్దంగా ఉండండి. తద్వారా మీరు కరుణించ బడవచ్చు". (ఆరాఫ్: 204)

9) దైవ ప్రవక్త (స) విధేయత:

"మరియు అల్లాహ్కూ, ప్రవక్తకూ విధేయత చూపండి. తద్వారా మీరు కరుణించబడే అవకాశం ఉంది". (ఆల్ ఇమ్రాన్: 132)

10) పాప మన్నింపుకై ప్రార్థన:

"మీరు క్షమాపణ కోసం అల్లాహ్ను ఎందుకు వేడుకోరు? తద్వారా మీరు కరుణించబడవచ్చు". (అన్నమ్ల్: 46)





## రచయిత ఒక చూపులో

పేరు సయ్యిద్ అబ్దుస్సలామ్. పుట్టింది తమిళనాడులోని అమ్మమ్మ ఊరైన వాలాజబాద్. పెరిగింది చిత్తూరు జిల్లాలోని కుగ్రామం నెరబైలు, పాత తురక పల్లి. ప్రాథమిక విద్య స్వగ్రామంలోని ప్రభుత్వ పాఠశాల. పై చదువులు దారుస్సలామ్ కాలేజీ (ఉమరాబాద్)
ప్రస్తుతం ఉంటున్నది కువైట్ దేశంలో. రాసిన మొదటి వ్యాసం నమాజు ప్రాశస్త్యం - 2005 గీటురాయి మాస పత్రికలో. ప్రస్తుతం నెలవంక మాస పత్రిక ప్రధాన సంపాదకులు. ప్రచురితమైన పుస్తకాలు ముఖబందిత మధుకలశం, హజ్జ్ ఆదేశాలు. అనురాగ రావం. టెలికాస్ట్ అయినా ప్రోగ్రాములు KTV2, మెర్సీ మరియు స్ఫూర్తి చానల్స్ లో వివిధ అంశాల పై ధార్మిక ప్రసంగాలు.
ప్రవృత్తి: సత్యాన్వేషణ.